


జనతా వారి "పరివర్తన" పినిశెట్టిగారి "అన్నా చెల్లెలు" నాటకం ఆధారంతో తయారుచేసిన చిత్రం. ఆ నాటకం ఆంధ్రలో అనేక చోట్ల విజయవంతంగా ప్రదర్శించబడింది. ప్రేక్షకులను నమ్మంగా కదిలించగల నాటకపు ఆయువుపట్లు కొన్ని ఇందులో ఉన్నాయి.

నాట్యంలో నృత్తంలాగా, సంగీతంలో వర్ణాల లాగా, పద్యాలలో భావకవిత్వంలాగా నాటకాలలో ఒక తరగతి నాటకాలు ఇతివృత్తంతో ప్రమేయం లేకుండా కేవలం వేదికనుబట్టి రక్తి కడతాయనిపిస్తుంది "పరివర్తన" లోని నాటకం ఆ తరగతికి చెందినదిగా కనిపిస్తుంది.

ఈ చిత్రంలోని కథలో చెప్పుకోదగిన ప్రత్యేకత ఏమీలేదు. ఇది వాస్తవ జీవితాన్ని కూడా అంత సూటిగా ప్రతిబింబించదు. ఆదర్శప్రాయుడు అనదగిన జమీందారు ఒకాయన సంతానం లేక అన్నదాన సమాజంలో ఉండే ఒక అనాథ శిశువును పెంచుకుంటాడు. ఈ పుత్రవాడు, ఆనందరావు (ఎన్. టి. రామారావు) పెరిగి పెద్దవాడై పట్నంలో చదువు సంధ్యలు పూర్తిచేసి తిరిగి వచ్చేదాకా ఎస్టేటు మేనేజరు రామయ్య (దొరస్వామి) జమీందారుగారి ఆస్తిని చూస్తూ, నలుగురికీ ఉపకారం చేస్తూ, ఆస్తిని అభివృద్ధి కూడా చేస్తాడు. ఆనందరావు ఇంటికి వచ్చాక ఆస్తి నష్టపెట్టుకుని రామయ్య సంపాదించుకున్న కీర్తిని చూసి అసూయాగ్రస్తుడవుతాడు. అతనిని రెచ్చగొట్టటానికి ఇద్దరు మిత్రులు - సోడాకొట్టు చలపతీ (రమణారెడ్డి.)లతోటి పెద్ద పిచ్చయ్యా (చదలవాడ కుటుంబరావు) - గా చేరింది పందికొక్కుల్లాగా ఆనందరావు దగ్గిర చేరి రామయ్య కుటుంబానికి ఎసరు పెడతారు. రామయ్య అన్నదాన సమాజానికి చందాలిచ్చేవాడు, ఎస్టేటునౌకర్లకు బోనసులిచ్చేవాడు. ఆనందరావు అవన్నీ మాన్పించటమే గాక రామయ్యకొడుకు సత్యం (ఎ. నాగేశ్వరరావు) పైచదువులకు డబ్బు సహాయం చేయ నిరాకరిస్తాడు, రామయ్యను అవమానిస్తాడు. మనోవ్యాధితో తండ్రిమంచానపడగా సత్యం ఉద్యోగం కోసం తిరిగి ఆఖరుకు బస్సు కండక్టరుపని సంపాదించుకుని ఆ వేషంలో ఇంటికివస్తాడు. కలెక్టరు వేషంలో కొడుకును చూద్దామనుకున్న రామయ్య కండక్టరు వేషంలో చూడగానే గుండెపగిలి చస్తాడు. తరవాత ఆనందరావు బస్సును కొనేసి సత్యానికి ఆ కండక్టరుపనికూడా లేకుండా చేస్తాడు. సత్యమూ, అతని చెల్లెలు సుందరమ్మా (సావిత్రి), అతని తమ్ముడూ (జూనియర్ నాగేశ్వరరావు) తిండికికూడా లేక బాధపడతారు. ఈ స్థితిలో చలపతి సుందరమ్మను అవమానిస్తాడు. ఇదివిని సత్యం చలపతిని కొట్టి జైలుకుపోతాడు. ఆనందరావు రామయ్య ఇంటిని స్వాధీనపరుచుకుని సుందరమ్మనూ, ఆమె తమ్ముణ్ణీ బయటికి పంపిస్తాడు. తమ్ముడు దారితప్పిపోగా సుందరమ్మా అన్నదాన సమాజం చేరి దాన్ని నిర్వహించే సంజీవయ్య (మిక్కిలినేని) అండను జీవిస్తూంటుంది. రామయ్య కుటుంబాన్ని విచ్ఛిత్తి చేశాక చలపతీ, పిచ్చయ్యా చేరి ఆనందరావుకే ఎసరు పెడతారు. ఆనందరావు దత్తపత్రం చలపతి కాజేసి పిచ్చయ్యదగ్గర దాస్తాడు. ఆనందరావు ఆస్తిని వారసులు స్వాధీనపరుచుకుంటారు. ఆనందరావుకూడా అన్నదానసమాజా

చేరతాడు. అక్కడ అతనికీ, సుందరమ్మకూ మధ్య అనురాగం ఏర్పడుతుంది. సత్యం జైలునుంచి తిరిగి వస్తాడు. పిచ్చయ్యదగ్గరవున్న దత్తుపత్రం సత్యం సంపాదించి ఆనందరావుకిస్తాడు. ఆనందరావు తన యావదాస్తినీ అన్నదాన సమాజానికి ఇచ్చేసి పరివర్తన ప్రకటిస్తాడు. అతనికీ సుందరమ్మకూ వివాహం జరుగుతుంది.

హృదయ పరివర్తన పొందిన జమీందార్లూ, ఆదర్శాలను నమ్ముకుని దెబ్బతిన్నవాళ్ళూ అన్నదాన సమాజాలకు చేరుకోవటమూ, ఎస్టేటు ఆస్తులు అటువంటి సంస్థలకు చెందటమూ ఒక విధమైన సాంఘిక పరిణామం అనుకోటానికి ఎట్టి ఆధారమూ లేదు. రామయ్య జీవితమంతా ఒక జమీందారు ఆస్తికి కుక్క కావలి కాయటానికి అంకితమయింది; "నువ్వు అన్నదానసమాజంలో నుంచే వచ్చావు" అని చెబితే ఆనందరావు ఎక్కడ నొచ్చుకుపోతాడో అని రామయ్య, ఆనందరావు ఇవ్వబోయిన సొమ్ముకూడా నిరాకరించి ఇంటికివచ్చి తాను మంచం ఎక్కడమేగాక తన పిల్లలను భ్రష్టుల్ని చేస్తాడు. ఈ రామయ్య పాత్ర ఒక ఆదర్శపాత్రగా ఈ కథలో చూపబడింది. తిరిగి చిత్రం ఆఖరులో సత్యంకూడా జమీందారు ఆస్తికి తన ప్రాణాలు అడ్డం వెయ్యటానికి సిద్ధపడతాడు! కథలోగల ఇటువంటి అంశాలను సమర్థించటం అసాధ్యం.

కాని ఈ చిత్రంలోని సన్నివేశాలు తప్పుగా ఉన్నచోటకూడా బలంగా ఉన్నాయి. ప్రేక్షకులను అవే కదిలిస్తాయి. ముఖ్యంగా ఆనందరావు దగ్గిరికి సత్యంవచ్చే దృశ్యమూ, సుందరమ్మ వచ్చే దృశ్యమూ ప్రేక్షకులను తృప్తినిస్తాయి. పిచ్చయ్య కూతురును (బాల సరస్వతి) సత్యానికి తన ప్రేమ వ్యక్తంచేసే దృశ్యమూ, ఆనందరావు ఆస్తికాజేసే సాంబయ్యా (కోడూరు అచ్చయ్య) పిచ్చయ్యా ఒకరినొకరు మోసం చేసుకునే దృశ్యమూ ప్రేక్షకులను ఆనందపరుస్తాయి.

ఈ చిత్రంలో పాత్రల ప్రదర్శన చాలా విజయవంతంగా సాగిందని చెప్పొచ్చు. మచ్చుకైనా తొస్సుపోయిన పాత్రలేదు. పాత్రలకు నిండుతనం కేవలం కథను బట్టేగాక డైరెక్షన్‌తోకూడా సాధించబడింది. చిన్న జమీందారు ఆనందరావులో ఇతరుల కీర్తి ప్రతిష్ఠలపట్ల అసహనమూ, తాను ద్వేషించేవారికట్టు విడవనిపగా, తన దృష్టిలోనే క్షుద్రులుగా కనిపించే వారిని చుట్టూ చేర్చుకునే మనస్తత్వమూ, వారి చెప్పుడు మాటలు వినే దౌర్బల్యమూ చాలా చక్కగా చిత్రించబడ్డాయి. సత్యం పాత్రలో ఉన్నతాదర్శాలతోబాటు యువకుడికుండే తొందరపాటూ, సాహసమూ చిత్రించబడ్డాయి.

పై రెండూ నాయక, ఉపనాయక పాత్రలైనప్పటికీ వాటికన్న ప్రేక్షకులను బలంగా ఆకర్షించే పాత్రలు పిచ్చయ్యా, చలపతీ. అడుగడుగునా చిత్రంలో రక్తింసాధించటానికి ఈ పాత్రలు చాలా బాగా తోడ్పడతాయి. అటువంటి వ్యక్తుల్ని జీవితంలో ఒక్కక్షణం భరించలేం. ఆ లక్షణానికి ఏమీ భంగంరాకుండా, ఆ పాత్రలను చూసి జుగుప్సపడటమే ఒక ఆనందకరమైన అనుభూతిగా ప్రేక్షకుడికి ఉండేటట్టు ఆ పాత్రలను సృష్టించారు. సుబ్బులు పాత్రకూడా అటువంటిదే.

డైరక్టరు తాతినేనిగారు ప్రేక్షకుల సంతృప్తి కోసం ఈ చిత్రంలో పూర్వం ఎన్నడూ పడనంత శ్రమపడ్డట్టు కనిపిస్తుంది. ఈ శ్రమకు ప్రతిఫలం ఉంటుందనటానికి ఎటువంటి సందేహమూ లేదు.

నటులలో ఎన్. టి. రామారావు, నాగేశ్వరరావు, చదలవాడ, రమణారెడ్డి, దొరస్వామి చాలా సమర్థతతో తమ పాత్రలను పోషించారు. సావిత్రి. బాలసరస్వతీ, జూనియర్ నాగేశ్వరరావు, మిక్కిలినేని, జమీందారు నౌకరుగా నటించిన పెరుమాళ్లూ, బొమ్మలమ్మేవాడుగా నటించిన రామకోటీ తదితరులూ కూడా బాగానే నటించారు.

అనిసెట్టిగారి పాటలన్నీ బాగానే ఉన్నాయి. "సంబారే" పాటా, పేకముక్కలడాన్సు, జైలు ఖైదీల పాటా, ప్రేక్షకులను అపారంగా ఆకర్షించగలవు. మోహనదాసు చలపతిరావుగార్ల సంగీతం చాలా తృప్తికరంగా ఉంది.

జనతా పిక్చర్స్ కొత్త సంస్థ అయినప్పటికీ వారి ఈ తొలిచిత్రంలో భారీయత్నం కనిపిస్తుంది. ఇదేవిధంగా ఈ సంస్థ బలమైన చిత్రాలను తీయగలరని ఆశించవచ్చు. ★